శ్రీ గురుభ్యోనమః.

# శ్రీకృష్ణశతకము.

ఇది

అచలగురుండగు

బ్రహ్మశ్రీ మాధవరాజు వేంకటేశ్వరరావు పంతులుగారి

ప్రియశిష్యుండగు

బ్రహ్మశ్రీ పీసపాటి కోటీశ్వర శర్మచే

రచియింపఁబడినది.

సత్తెనపల్లి తాలూకా యిలాకా

కమ్మాలపాడు గ్రామనివాసుండగు

ప్రత్తిపాటి ముక్తేశ్వరరావు గారు

ఈ గ్రంథమును స్వార్జితద్రవ్యముచే నచ్చొత్తించి

ప్రచురించి సత్కీర్తినందిరి.

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడియె.

1927.

శ్రీ గురుభ్యోన్నమః.

# శ్రీకృష్ణశతకము.




ఇది

అచలగురుండగు

బ్రహ్మశ్రీ మాధవరాజు వేంకటేశ్వరదా[illegible]కవులవారి

ప్రియశిష్యుండగు

బ్రహ్మశ్రీ పీసపాటి కోటీశ్వర శర్మచే

రచియింపఁబడినది.



సత్తెనపల్లితాలూకా యిలాకా

దమ్మాలపాడు గ్రామనివాసుండగు

ప్రత్తిపాటి ముక్తేశ్వరరావుగారు

ఈ గ్రంథమును స్వార్జితద్రవ్యముచే నచ్చొత్తించి

ప్రచురించి సత్కీర్తినందిరి.



బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడియె.

1927.

—• శ్రీరస్తు. •—

సీ॥ అగధారియై మున్ను • యాలనేలె నెవండు
యగచరులను నేల • నమరె నెవఁడు
వసుదేవునకు దనూ • భవుఁడయ్యెను నెవండు
వసువులం దొకరుఁడై • వరలె నెవఁడు
కమలనాభుండు నా • కర్జినెచ్చె లెవండు
గమలేశుఁడై స్మరు • గనె నెవండు
హరినామకత్వ వి • హారమందె నెవండు
హరిని శిక్షనొనర్చు • నతఁ డెవండు

గీ॥ అట్టివామనుండు • నగు పరికాండుఁ డనార
తంబు కృపను విపుల • డంబుమీర
సీతదృష్టిఁగొలిచి • సిరులంద నీకృతి
బుడమి వరలునట్లు • ప్రోచుగాత.

సీ॥ రాజనందనుఁడయ్యు • దేజిమోము వరించె
రాజార్క వరనేత్రి • రాజిదాల్చె
నజుఁడయ్యు లోకము • ల్స్రజియించె గ్రిమ్మర
నజుఁడయ్యు బెంచె మ • హాత్త్రముఁగ
వనచరుండయ్యు ము • న్వరగట్టుదాలిచె
వనచరుఁడయ్యు న • ద్దనుజు దుంచె!
రామరామ యటన్న • రసికులఁ గడతేర్చె
రామశాపంబు బి • రానదీర్చె

గీ॥ నాత డెవ్వఁడట్టి • భూతవల్లభుఁడగు
శ్రీనివాసుడింక • జెన్నుమీర
నార్యమణులు గాంచి • "జోరా"యనన్గృతి
భూరికృప నెసంగఁ • బ్రోచుఁగాత.

ఇట్లు అచలగురుఁడు,

మాధవరాజు వేంకటేశ్వరదాసు.

# అవతారిక

సీ॥ అఖిలపార్థివులది • వ్యాస్థానవర్యులై । వెలయుధన్యాత్ములా • ర్వేలవారు
శబ్దశాస్త్రాదిప్ర • శస్తాత్ములై ధాత్రి । వెలయుధన్యాత్ములా • ర్వేలవారు
దాతృత్వమునఁ బలి • దగ కర్ణుఁ బోల్పగ । వెలయుధన్యాత్ములా • ర్వేలవారు
సుజనస్తవంబున • రజనీశులేయన । వెలయుధన్యాత్ములా • ర్వేలవారు
రాముకార్యాఘుని • ర్వాహకత్వమున । వెలయుధన్యాత్ములా • ర్వేలవారు

గీ॥ అట్టియార్వేల శాఖయం • దవతరించి । సకలశుభములుఁ జేకొన్న •
శౌర్యధైర్యుఁ । డైన శ్రీ ప్రిత్తిపాటి కు • లాబ్ధిసోము । డనగఁ జెన్నొం
దె కోటీశ్వ • రాఖ్యఘనుఁడు. 1

క॥ ఈసుగుణోద్దాముఁడు దర । భాసురవంశాభివృద్ధి • భావనుతోడన్
భూసుర తద్గోత్రాన్విత । వాసుండన నొప్పునట్టి • వారలకడకున్.

క॥ చేరి జూపూడి ముత్తయ । ధీరాత్మోద్భవులలో ద్వి • తీయుండును మేల్
సూరివరేణ్యుండును పర । తారహిమకరసదృశ • తనుకీర్తికరున్. 3

క॥ ముక్తేశ్వరాఖ్యమణి నా । సక్తింగొని తెచ్చి విప్రు • శాస్త్రప్రహితోక్తిన్
రక్తిగ స్వీకారమ్ముబుధోక్తిగ గొనె గోటయాఖ్యుఁ • డూర్జితమెసగన్

శా॥ ఆముక్తేశ్వరరావు నన్నుగని య • త్యాసంద మింపొందగా
ప్రాముఖ్యంబగు తత్కృతంపు వరకా • వ్యంబొక్కటిన్నీయుచున్
ప్రేమన్నార్జిత ద్రవ్యసంగ్రహము ని • ర్దేశ్చ్ఛకం గూర్చియున్
నామోదంబున నచ్చొచర్తు నని క్ర • న్నన్బల్క శ్రీ సద్గుణో
ద్దాముం డీతఁడటంచు నెంచి మును శ్ర • ద్ధన్గూర్చియున్నట్టి శ్రీ
ధాముం డవ్వరకృష్ణనామకపు గ్రం • థంబీయగ న్వేడ్కబల్
సామోపాయముబూని సత్వరముః స • త్సాధుల్దగ న్మెచ్చగ
న్నీమంబొప్పగ నచ్చొనర్చి విపుల • న్నిల్పెన్ మహాసద్యశం
బీమాన్యాత్ముని సర్వసంపదలచే • యేప్రొద్దు రక్షింపు మో
స్వామీ! తావక సత్కృపారసమునే • వన్నిల్పి కృష్ణా! హరీ.

ఇట్లు,

పీసపాటి కోటీశ్వర శర్మ.





# శ్రీకృష్ణశతకము.



శా॥ శ్రీ రాజత్కమలా మనోహరయశ • శ్రీతార్క్ష్యవాహాంబు స
ద్ధారిందాద్రిది సురాళిసన్నుతజగ • త్ప్రాణేశవిద్వన్నుతో
దారాత్వంపదధీవిలాస పరమా • త్మా! వేదవేద్యా! భవ
చ్చారిత్రంబు నుతింతు నెల్లపుడు కృ • ష్ణా! రావె నన్బ్రోవవే! 1

మ॥ జలజాక్ష ప్రతిమప్రభన్వెలయు మేల్ • సౌందర్య చైతన్య దా
జలజారి ప్రభయై చెలంగు పరవి • స్తాకప్రకీర్తి ప్రదుం
డిల శ్రీ మాధవరాజు వేంకటప్రభున్ • యేన్గొల్తు భక్తిం దగన్
సరిగన్ హృజ్జలజాతమం దెపుడు కృ • ష్ణా! రావె నన్బ్రోవవే! 2

శా॥ ఛందంబాదిగ గాన్యసంతతుల స • చ్చాతుర్లో సద్బుధః
ఛందప్రౌఢుల నెల్ల సత్వరము స్వ • చ్ఛంబంచు సూచించి మే
లందం బొప్ప నతిస్నుతి న్సలిపి పెం • పంద న్దగ న్గొల్చెదన్
సందేశంబు నొకింతయున్ గొనక కృ • ష్ణా! రావె నన్బ్రోవవే! 3

మ॥ ధరణిన్ మామక దేశికద్విజముఖం • ధర్మాత్ముడై యొప్పి శం
కరదేవు న్యచలప్రబోధ నిధ న • క్కాణించి కందమ్ములన్
వరకందార్థములన్ రచించితివి యా • నందంబు పెంపొందగ
న్వరదా! భాగవతాఖ్యవంశభవ! కృ • ష్ణా! రావె నన్బ్రోవవే! 4

మ॥ సరియా వాయుమనద్వివేగముల ని • చ్చామాత్రత న్బత్తి త్వ
చ్చరణాబ్జంబులు గొల్చు సజ్జనుల దా • సత్వంబునంద న్భవ
త్కరుణ న్నెంతయు గొల్వ నేగెదవు ని • క్కం బీవు భక్తాధ్యతన్
ధరణి న్భాగవతాఖ్య వంశభవ! కృ • ష్ణా! రావె నన్బ్రోవవే! 5

మ॥ తవరాజంబును జౌకసేయు నుడి సిం•ద్రైయుండ మర్త్యాళి నిం
పు వహింప న్గడు వేడనే? నిను సం•పూజింతు భావింతు జి
త్తవికాసం బెసగంగ నర్మిలి • నగం దార్కొల్పి సేవించెద
న్భవరాహిత్య మొసర్ప సత్వరము కృ•ష్ణా! రావె! నన్బ్రోవవే! 20

మ॥ అవనిన్ యెన్ని భవంబులెత్తితి నహో•యయ్యా! ప్రభో! నేడు స
ద్భువినిం దేశిక పాదపంకరుహము • ల్పూజించి ధ్యానించి మేల్
స్తవమున్భక్తి బొనర్చి లక్ష్యమును వే • దత్వంబునై యొప్ప యే
నవురా మానసశూన్యమౌ బయలు కృ•ష్ణా! రావె! నన్బ్రోవవే! 21

మ॥ సరిగాతత్పద త్వంపదం బసిపదం • సౌకర్య మైక్యంబునుం
దిరమౌవాక్యచతుర్థముల్ యుపనిషద్యై • దీపించు యవ్వాటి మే
ల్వరదాష్టాంగము దుర్ఘటము న్విపులమొ•ప్ప న్బ్రహ్మమీవందు న
న్పరిశీలించి గురుండు దెల్పెమును కృ • ష్ణా! రావె నన్బ్రోవవే! 22

శా॥ సారాచార విచారముం దొలి మహా•సౌమ్యుల్ యటం చాడి య
క్రూరుండాదిగ భక్తసంతతుల ని • గ్గుంజేయగా బూని వి
స్తార శ్రీకరులైన ధీరులకు మే • ధాసంతమై యొప్ప స
త్సారాంశంబగు బోధ దెల్పితివి కృ • ష్ణా! రావె! నన్బ్రోవవే! 23

శా॥ పోరున్గోరి గిరమ్మై దనర్పగోని సం • పూర్ణత్వమున్నందు య
వ్వారి స్థీరవరేణ్యులై దనర వా • హా! సర్వశూన్యత్వమే
మేరన్ మెట్టకుపల్లవం దెచట సు • మ్మా నిల్వ! నీడంచకన్
సారథ్యంబుగ నుండజూచితివి కృ • ష్ణా! రావె! నన్బ్రోవవే! 24

మ॥ నగమున్నెత్తి సమస్తప్రాణులను గ్రి • న్నన్బ్రోవగా జూచి తా!
ఖగమున్నెక్కి చరాచరంబులను శం • ఖారావమై యొప్పగా
మొగమాటంబున భక్తసంతతిని సం • పూర్ణంబుగా నేల నన్
జగతి న్గావగ నెంత భారమగు కృ • ష్ణా! రావె! నన్బ్రోవవే! 25

మ॥ నగుబాటందగ సేయకయ్య పరము • న్గాంక్షించి యిప్పట్ల నిం
పుగ జెంద న్భజనాది సత్క్రియలు బెం•పున్నందగా జేసి పో
కుగ త్వత్పాదసరోజముల్మతిని టీ • కుం జెంద ధ్యానించెదన్
దగ దామోదర! భక్తవత్సలత కృ • ష్ణా! రావె! నన్బ్రోవవే! 26

శా॥ పేరందుం గలిగున్న గౌరవమునుం బిప్పైవ్రచనం జేయకే
ద్వారిన్ యెట్టులొ నద్ది సన్న జేసయు వ్యక్తుండ వీవయ్య యీ
సారి న్వేగ భవద్దమానుధ గథీ శా! చిల్క పాడింపంగదే
సారశ్యం బొనరంగ వేడెదను కృష్ణా! రావె! నన్నోబ్రోవవే! 27

మ॥ ధరణిన్ జారుల చోరులన్ ఖలుల మాద్యంబెంతయుం బాధి దు
ష్కరులై మంచియు చెడ్డయుం గొనక గామాంధ్యాట సంచారులై
పరుల న్నిందలొనర్చు వారలను సద్భక్తాధ్యులన్ బేలలన్
బరమాత్మా భరియింప నీవెగద కృష్ణా! రావె! నన్నోబ్రోవవే! 28

మ॥ తురుష్కా క్రూరులు నాదుబారి మరియుం దత్తానబీజంబులన్
పరిబోల్పందగు క్రూరులన్నను యజ స్త్రిం గూడకుండ న్భవ
త్కరుణన్నిల్పియు వారలెన్నటి గిరం గ్రోధ నాదుబారం జొగి
న్నరిగ న్దెల్పగ నిన్ను వేడెదను కృష్ణా! రావె! నన్నోబ్రోవవే! 29

మ॥ ఎదుట న్నిక్కముబల్కి యద్దియును యెయ్యెర్పాటుగా దప్పులుం
గదుపంజాలియు నొప్పుల న్గపి నిగ్గై యొప్పువా రత్తముల్
మదనాసక్తులబోలి గొంపులను మ మ్మార్చట్టు డాగుండి ని
న్నదునంగా పలురీతుల న్బనమె కృష్ణా! రావె! నన్నోబ్రోవవే! 30

మ॥ అపుడాడాకక్కి యొకండు నింక శిశుపా లాఖ్యుండు నాకూరుడు
న్విపరీతోక్తు లెదురొక్కన న్గరపు యవ్వేళందు న్యూనాస్పదం
బుపమింపం దగజేయు వారలకు మేల్మోక్ష ప్రభావంబుగా
శపథంబున్నిడి వేగ జూచితివి కృష్ణా! రావె! నన్నోబ్రోవవే! 31

మ॥ కనియుం గానక నెగ్గులే మెపుడు సత్కాంజాక్ష! నేరంబులన్
మును యేసల్పు యఘవ్రజంబు త్వర నిర్మూలంబు నొందించి పా
వనమై యొప్పు సుధారసంబువను సద్భంగోపమాంగంబులన్
నను వీడక్కక జనంబు గాం గృపను కృష్ణా! రావె! నన్నోబ్రోవవే! 32

మ॥ కలికాలంబు వనంబు నిశ్చయము నై గాంక్షింపగా నొందు ని
శ్చల బ్రహ్మంబు ద్రుటినిశ్చకము మెచ్చ న్నందినా మంచొగిన్
దలల న్నాప్రుచు వాసము ల్గొలుప నంతర్మోక్ష మెట్లబ్బు విన్
పలికునొక్కరి జనంబు న్దనము కృష్ణా! రావె! నన్నోబ్రోవవే! 33

మ॥ హరుల న్గోరిన నీయ నెట్లగును నీకై యొప్పు వాహంబు మే
ల్గరుడుండయ్యె ననారతంబు దగ వేణ్వాదుండు మంచన్న నో
నగధారీ ధర నాలగాపరివి యన్నా యింకెటుల్ బల్కు వి
న్నగనైన న్బగనైన సత్కృపను కృష్ణా! రావె! నన్బ్రోవవే! 34

మ॥ ధరణిన్ భూసురవర్యులు న్నెద నినుం దారొల్పి ధ్యానించి భో
జ్య రసాన్నంబు లొసంగిన న్విపులసంజాతాదు లాసత్కృవుల్
బోర్కై బూని నధించి యామిషము మెప్పొన్గాంచ నర్పించినన్
భరియింపందగు నిత్యకారుడవు కృష్ణా! రావె! నన్బ్రోవవే! 35

మ॥ దరిలేనట్టి కుయుక్తులన్ నృపుల సిద్ధాయం చొగిన్ గూర్చి మేల్
గరిమ న్మర్త్యుల కిచ్చి విత్తమును సత్కాంతపార్థియై చెంది దు
ష్కార జన్మంబును మృత్యువుం గొనుచు నిక్కంబొప్ప భక్తాఘృత
న్సరిగా జెందఁడు నత్తోధ్యు డెన్నఁడును కృష్ణా! రావె! నన్బ్రోవవే!36

మ॥ అలనాఁ డంబుధి దేవదానవులు నాహా యంచు దచ్ఛింగ నం
దలి జన్మించిన పంచమేధ్యు డవి నిద్ధా యంచు విత్తాఘ్యులన్
దలప న్నేత్రి సుకర్ణవాగ్బిలములన్ ఘట్టించి నిల్పంగ మున్
జలజాతాక్షు! వరంబొసంగితివి కృష్ణా! రావె! నన్బ్రోవవే! 37

శా॥ పంకంబందున దామరల్ బొడమె సొంపై యొప్పు రేవెల్గునం
దింక న్నైర్మల్యత నొప్పె మూరుడు యశశ్శ్రీయై యనంగస్థితిన్
జంకు న్నింపక తద్విధి న్వరల సచ్చారిత్రిమా నీకృతిన్
శంకన్నందిన నంత లోటగునె కృష్ణా! రావె! నన్బ్రోవవే! 38

శా॥ పాంచాలి న్మను మానభంగ మొనపన్ బైపై వసన్ శాత్రవుల్
యెంచన్ జీర లనేకమై నొదవునై యేర్పాటు గావించి దు
శ్చాంచల్యంబు హరింపజేసితివి సచ్చారిత్రి నిన్వేడఁగ
న్నంచద్భావుడవై చరించెదవు కృష్ణా! రావె! నన్బ్రోవవే! 39

మ॥ కలదేమో కలదంచు నింపుగొన కక్కాలంబున న్నెన్నొ గొ
త్తలకు న్యత్న మొనర్చియుం దుదకు జింతన్నొందు మున్ ధార్తరా
ష్ట్రిల చందంబును గాంచి మెచ్చితివి యొట్టు ల్దుర్మదాంధజ్ఞులన్
గలకాలంబు హరింపజూచెదవు కృష్ణా! రావె! నన్బ్రోవవే! 40

మ॥ తలపన్ దుర్మతు లెందు గౌరవమునుం • పక్ష్యంబు జెందంగ ని
ర్మలచిత్తాధ్యక్ష యెట్టులుంబోడను, సన్మార్గత్వ సంచారులై
తొలియేనిన్ యెపుడేని సత్క్రతువులన్ • దోట్పాటునుం జెందక
స్ఖలనంబు వ్వరియింప నెట్లగును కృష్ణా! రావె! నన్బ్రోవవే! 41

శా॥ చి చ్ఛుంకమ్మ పురం బెరుంగదను దు • శ్చేష్టందు చారిత్రము
న్మెచ్చుస్ఫూర్తిని యీసు సాధుసిందనము గ్రీ • ష్మ స్వల్పనూహించి యం
తశ్చాంచల్యము వెళ్లికొల్పుచును బ • ద్ధబ్బిబ్బులన్ నందుచున్
సచ్చారిత్రమునుంగలన్ గొనరు కృష్ణా! రావె! నన్బ్రోవవే! 42

శా॥ ద్వైతాద్వైత విశిష్టమా త్రిమతముల్ • స్థాపింప నీవయ్యు సూ
ద్వైతాద్వైతగురులాదియౌ త్రిమత ము • ద్భావంబుగావించి మే
ల్వాశాంబు న్నిఖి యాదిభూతరహితం • బై యొప్పు నిగాహ్వచ్యమున్
ఖ్యాతిం గవ్వడి కిట్లు దెల్పితివి కృష్ణా! రావె! నన్బ్రోవవే! 43

శా॥ మాతానాస్తిపితాయటు ల్యనుచు సం • బంధు ల్సఖుల్సోదరుల్
భూతప్రాభవమెల్ల నస్థిర మహో • పుత్రా! బలీ యంచు ని
ర్వాతంబై తనరారు నిర్భయులు వా • హ్వారే! స్థిరంబంచు మున్
ఖ్యాతి న్భక్తులకెల్ల దెల్పితివి కృష్ణా! రావె! నన్బ్రోవవే! 44

శా॥ భూతాపూతవిమైక మంతయును నొ • ప్పు న్నీవభేదత్వ ని
ర్ణేతా! యెన్నాగతు ల్సభాష్యకులు ము • న్నిర్మించు టేమందు? బ్రి
ఖ్యాతి న్నిర్మలమూర్తి నీ వనిన శ్రు • త్యర్థంబు గూఢంబుగన్
జాతంబెట్టులు నందజేసితివి కృష్ణా! రావె! నన్బ్రోవవే! 45

శా॥ నానాభూతహృదబ్జ సద్వసిత మె • న్ను న్నొప్పి నర్తించను
ల్గానుం దైవసత్తము ల్యను టదే • లా? పార్థివు ల్మంత్రులుం
గానుం దేశిక భక్తసంతతులు ని • గ్గై యొప్పు విత్తాఢ్యుల
న్నానారీతులెసంగు త్వన్మహిమ కృష్ణా! రావె! నన్బ్రోవవే! 46

శా॥ వందేయంచు వచించి యర్పణను దే • వా! సల్పితి న్నేడు నా
సందేహంబును దీర్చి ప్రోవు మిక నో • స్వామీ! జగద్రక్షకా!
మందేహారుని బోలు శాత్రవులు గా • ఢమ్ముం బాధిల్లయై యొప్పగ
న్నం దేట్టున సంహరించెదవొ కృష్ణా! రావె! నన్బ్రోవవే! 47

మ॥ సిరినిం దార సుపుత్రమిత్రజనులన్ శ్రేష్ఠప్రశంసించుచున్
హరి దామోదర యంచు సంస్మరణ మెన్నంజూడ రీమర్త్యులి
ద్ధర సంసారవిమోహచిత్తులయి సత్త్వంబంద రెప్పట్టునన్
సరసీజాక్ష! పరంబికెట్లనయ కృష్ణా! రావె! నన్నేలవే! 48

శా॥ మంథానాచలధీరుడన్నుడివి యా తత్త్వం దెల్పంగ సంస్తవ్యమున్
సంధానం బొనరింతు పద్యనము మేలక్ష్యంబుగ న్నోమహాసం
బంధధ్వాంతమునన్ దివాకరుండవై బల్మిన్ హతంబందియున్
సందేహంబును దీర్చి ప్రోవుమిక కృష్ణా! రావె! నన్నేలవే! 49

మ॥ వ్యయదోషంబుల చేతజిక్కియు నొకింత న్దైన్యలేక న్భవ
ద్దయ కాసక్తత యే న్యనారతము నాత్మన్ జెంది ధ్యానించితిన్
హాయమోహంబుండినసామి వేడుకను మేలయ్యారె యిప్పట్టున
న్భయదంబై తనరారసేయు మిక కృష్ణా! రావె! నన్నేలవే! 50

మ॥ అయమైన స్వరసంబు సోకినను మేలయ్యారె భర్తృంబుగ
న్నయమొప్పన్గురంచు సంతోషితులు యత్నా బల్కుగానం దగ
న్నయచారిత్రి త్వదీయ సత్కృపను గ్రన్న న్నిల్పి శోభస్కరా
శ్రీయ! రక్షించుట కీవెగా కేవల కృష్ణా! రావె! నన్నేలవే! 51

మ॥ మురువారి న్మతినొందువానివలె కేవలంబొప్ప సవ్యక్రియా
పరుడై దుర్విషయాదులం గొనక సత్సాత్త్వికైకస్థితిన్
సరిగ న్వర్తిల కెట్టులేని పరమున్సాధింప శక్యంబె? మే
ల్వరసై కామరసంఘ సద్విసుత! కృష్ణా! రావె! నన్నేలవే! 52

శా॥ తోల్కారందున బచ్చికల్ పసులు సంతుష్టాత్ములైనట్లు న
మ్మొల్లో సస్యము గాంచి బల్లభకుల్ మోదంబునుం జెందు న
ట్లుల్లాసిల్లు సువృత్తమున్ గ్రిందపమున నో హోయన్న పద్యంబలెన్
గల్గాలంబు త్వదీయ సన్నుతుడ కృష్ణా! రావె! నన్నేలవే! 53

మ॥ మనుజుల్ యాశను కృష్ణసర్పవిషమున్ బాదాది మూర్ధస్థలిన్
గొనుటన్నంత నహర్నిశంబు ధనమున్ గోర్కుల్ ప్రపాలించి గ్రి
ద్దన సంసారవిమోహచిత్త మనువా దంజేర్చి త్వద్భక్తినిన్
ద్వనమందన్ స్మరణంబొనర్ప రిల కృష్ణా! రావె! నన్నేలవే! 54

శా॥ కాసైనన్ గయిలేక నిత్యవిధి సత్కైంకర్యము న్గాక విన్
ఫీసం బార్జనలేక నెట్టులెదియ న్వీలుం గనం గాక మ
ద్వాసస్థాన పరిత్యజంబునను యొబ్బంగిన్ జనన్నీక నా
నాసంబంధిగ జేయ నెద్యమగు కృష్ణా! రావె! నన్బ్రోవవే! 55

శా॥ వాసస్థాన మొకింతగాక విపులత్వంబెద్ది గానీక శ్రీ
యాసాంతంబులులేక దార్ఢ్యమది మేసందాదిశీర్షస్థలా
భాసంబెంతయు నోక వంటకము కష్టాత్తుత్తుపీన న్నైద
న్గాపింపెందగ జానోవరద! కృష్ణా! రావె! నన్బ్రోవవే! 56

శా॥ మోసం బందినవారి నెల్లపు డెదన్ మొక్కిందుచున్ యోగమ
భ్యాస శ్రీకరులైనవారిని మహత్త్వంబొప్పవే యొంచగిన్
దోసిల్యొగ్గి భజించువారి నెటులన్ దోయంగ వీలౌను విన్
దాసత్వం బొనరించెగ న్నతిని కృష్ణా! రావె! నన్బ్రోవవే! 57

మ॥ కవి ము న్గూడదటన్న నంత గుశచే గన్పేటు గావించితా!
భువి నేల న్నఘుమందు నబ్బలిని సన్మార్తుపాదుం జేసితా!
భువనాధీశపతంగసూనుకయి విన్పొంచుండి భక్తు కానజః
సవనధ్వంస మొనర్ప జేసితివి కృష్ణా! రావె! నన్బ్రోవవే! 58

మ॥ నవనీతంబు వరించి శైశవక్రియ న్నానాప్రకారంబులన్
నవనీతంబు భుజించి యవ్వనత మేల్నారీమణిశ్రేణులన్
దవుల న్గోకలుగొంచుబోయి యశమున్ దాసోహము ల్కందితా!
సవికల్పంబంది నిర్వికల్పగు కృష్ణా! రావె! నన్బ్రోవవే! 59

మ॥ నిగమంబుల్ మును గొంచబోయిన మహాసీచాత్ముడౌ సోమకుం
దగ సంహార మొనర్ప మీనముగ జాతం బంది నద్దైత్యుని
న్నగధారీ! దునుమాడి వేదములు గ్రన్న న్ధాతకు న్నిచ్చుటన్
భగవంతా! నిను నమ్మితే తరిని కృష్ణా! రావె! నన్బ్రోవవే! 60

మ॥ గురుభక్తి న్బ్రొనరింప శిష్యుని గడు న్గూర్మి న్దగ న్గావగా
నరసింహాకృతి దాల్చి సత్వరము యన్నా దుర్మదాంధత్వసం
భరితుండైన హిరణ్యకశ్యపు వధింపం జేసితౌ గాదె విన్
దరమా? యెన్న భవత్ప్రతాపము కృష్ణా! రావె! నన్బ్రోవవే! 61

మ॥ శరమీఁవయ్యెఁ బురత్రయంబులను దుఁశ్చారిత్రులౌ దైత్యులన్
గర మాశ్చర్యము దోఁపఁగా హతము ముఁన్గావించి యద్దేవులన్
జరలున్ దీర్చి యశంబుఁగాంచితివి సఁచ్చారిత్ర! యప్పట్టునన్
వరదా! భక్తసరఁయణా త్వరను కృష్ణా! రావె! నన్నోఁబ్రోవవే! 62

మ॥ తనువున్నాపి పఁటుశక్యటంచు దోలి మాఁతల్లిట్లు కైసౌజ్ఞనుం
గొని హాఁయించని జోలనంద వది సఁద్గోప్యంబునై యొప్పె నం
తను బాల్యస్థితి దెల్యక న్వివుల నిఁచ్రన్ జెందుటన్నిట్లు గ్రి
న్నన నిన్వేఁడితి నెట్లొంవర్పెనవా కృష్ణా! రావె! నన్నోఁబ్రోవవే.! 63

మ॥ వినయత్వాది గుణాశ్రితాశ్రితుడ వీఁవేయంచు నశాంతముల్
సనకాది స్మునివందితాఖిల యశఁస్సన్మార్గఖేదప్రిపి
వినుతాఁ సూనవ్వథివాహ యవ్విదురుడఁప్వీరుండు యకూ్రరుల
స్మ్రనుడీ మోక్ష మిదంచు దెల్పితివి కృష్ణా! రావె! నన్నోఁబ్రోవవే! 64

మ॥ సరిగన్ తమ్ముఁరుహాసంతతి న్వేఁయు నఁశ్వర్ణంబుగా నింక ని
ర్జరులందున్ హరియున్న్రహంబులను మాఁర్తాండుండు వ్యాళంబులం
దిరమౌ వాసుకియు న్నగంబులను గఁస్థిన్ మేరువే నంచు మేల్
సరళి న్గఃవ్వడి కిట్లు దెల్పితివి కృష్ణా! రావె! నన్నోఁబ్రోవవే! 65

మ॥ అభిమన్యుం బ్రియపేర్మిసి న్వతుల యఁత్యాసక్తి గాపాడి స
త్సభవారెల్ల బలేయనంగ నపుడున్ ఁ సౌఖ్యప్రసూతంది సూ
నుభవం బావగ నప్పరీక్షితుఁడన ఁ న్నొప్పించి యప్పాండవం
శభవుం బార్థివుగా నొనర్చితివి కృష్ణా! రావె! నన్నోఁబ్రోవవే! 66

శా॥ అప్పా! యెన్నివిధంబుల న్నిను మహాఁ యత్యద్భుతం బొప్ప బ
ల్మెప్పుంగాంచ నహర్నిశంబు హృదినిం ఁ బ్రేమ న్దగ స్తోత్రము
న్గొప్పంచు న్నలుపన్ ద్వాదీను కరుణఁ న్గోయంచు పూరించినన్
దప్పై యొప్పునటంచు నెంచితివా కృష్ణా! రావె! నన్నోఁబ్రోవవే! 67

మ॥ తలక్రిందన్నల గాళ్ళపై నిడియు వేఁద్యంబొప్ప ధ్యానింప ని
శ్చల చిత్తం బెసయ న్నుసు న్నెరను మోఁచ్చంగనూర్చి యర్పింప యే
న్గలనైన న్ఖరియింపజాల నిక నో ఁ కంజాక్ష! యిప్పట్టునన్
దలపం బాలనొ నీళ్ళ మూంపు నిక కృష్ణా! రావె! నన్నోఁబ్రోవవే! 68

మ॥ గజరాజప్రు బిపాసదీర్ఘ జన సంక్రిబెంతో బాధింపగా
రజనీశార్కసునేత్ర! సత్వరము రారా! కేశవా! యంచు ని
న్భజియింపంగ జవంబున న్నగరి సంధ్భక్తాఘ్య! రక్షించగ న్న
జరానీకము మెచ్చులందిరట కృష్ణా! రావె! నన్బ్రోవవే!

శా॥ భక్తుండై వరమంది వెంటజన సంబ్రాధంబలేక న్భవుం
డార్తిన్బాఱుటగాంచి గ్రిన్ననను యత్యాసక్తిచే యుక్తరిఁ
యుక్తి న్నేర్పల్ రజమంద జేసితివి దైత్యుం ద్వచ్చరిత్రింబులఁ
శక్తిజెందిభజింపనీలగునె కృష్ణా! రావె! నన్బ్రోవవే! 70

శా॥ యాజ్జీవిత కాలమివ్విధిని నెయ్యంబొప్ప సాక్షీశ్వరున్
జేవంబూని ప్రియత్నమంది తడి మంజీవంబు జాలింతు వే
ద్రోహం బారి యనేకభంగు లెటులం దోడ్పాటున న్నెమగుఁ
శ్రీనత్యంబొప్పగ నారగ్రిమై యొసగ కృష్ణా! రావె! నన్బ్రోవవే 71

మ॥ ఇహభోగంబున హేమవిద్య పరము న్నైర్పాటుజెందంగ వి
న్నహాజంబో యమునస్కభావని సంత్సాదుల్ దగన్బల్కుటఁ
విహితంబొప్ప యహర్నిశంబు హృదినిం బ్రేరేపణ న్నొప్పగ
న్బహురీతుల్ శ్రీమలొందజేసితివి కృష్ణా! రావె! నన్బ్రోవవే! 72

శా॥ జామాతంచని యెంచక న్నపుడు దుస్సాధ్యుండునై యొప్పి యుం
గామాంధన్వ విచారతం దగిలి యెగ్గైయొప్పు కార్యంబుఁ
సామాన్యంబుగ నల్పునట్టి ఖలు గంసధ్వంస మున్నంతతో
స్వామీ త్వచ్చరిత్రల్ నుతించెదను కృష్ణా! రావె! నన్బ్రోవవే! 73

శా॥ విశ్వాకారముసంది యంధునకు మున్నేయంచు సద్దృష్టిమేల్
శశ్వత్సౌఖ్యమ్ము లిచ్చినావు ఖలులాం సొంతంబు మూర్ఛిల్లగా
వశ్యంబై చనజేసి ద్వారకపురిం న్వాంఛించి యేగంబగఁ
యశ్వగ్రీవ! జనార్దనా! వరద! కృష్ణా! రావె! నన్బ్రోవవే! 74

శా॥ నానాకర్మ పరిభ్రమందగిలి సన్మార్గ్యక్రియాశూన్యులై
హానిం జెందుచు శాస్త్రచర్చవిపులం త్వాసక్తి బూరించుచుఁ
దేసందు న్నమవర్తులై సుజనశక్తిన్గాంచనన్నట్టి య
జ్ఞానాంధాత్ములనేలుటెట్లులను కృష్ణా! రావె! నన్బ్రోవవే! 75

మ॥ ఇడనుం బింగళనాడులం దెపుడు నాయుర్భాగ్యమెట్టు జెన్నొందగా
నడిమీరం దగు ప్రాణవాయువు సమత్వంబంద బూరించుచుం
గడకు న్నిగ్రహి యొక్కవేళుపయు నిగ్రానారుసూర్ప్లొప్పనా
నడక న్మానిన బెద్దసిద్ధుఁడయె కృష్ణా! రావె! నన్నుఁ బ్రోవవే! 76

మ॥ జలమం దుద్భవమైన బుగ్గవలెఁ గంజాతాక్ష! దేహంబు దీ
జలజారిస్థలులం లయంబుగతి వాస్తవ్యంబుగా నెన్నఁగన్
గలకాలంబు వసింపఁబో దనుచు నిర్గ్రయొప్పె శ్రుత్యర్థముల్
శిలవున్నొంచకముందె యుత్తరిని కృష్ణా! రావె! నన్నుఁ బ్రోవవే! 77

శా॥ గోవున్నాఁపియు నేగుకోడెబలె భక్తుం డెట్టులేగొందినన్
గావంగా దగ వేగ వెంటజను వక్కాణంబు నిక్కంబనా
తీవన్నీషక నీసరిన్నటులు బల్ శ్రేవ స్తటాంతీంచవే!
శ్రావ్యంబొప్ప నుతింతు నెల్లపుడు కృష్ణా! రావె! నన్నుఁ బ్రోవవే 78

శా॥ దీపంబుం బగ! బోలి నిత్యమును సత్తేజోవిలాసంబు క
న్నాపందు న్వెలుగొందుదీవు సుజనుల్ పల్మారు వీక్షించినన్
గాపట్యంబో యింత లేక సరిగన్నాపాడ నీవం చొగి
న్నాపద్బాంధవ! నమ్మియుంటి నగ! కృష్ణా! రావె! నన్నుఁ బ్రోవవే! 79

మ॥ తనయుండేష్వ గుడంబు కేల్నిడియుఁ దత్కాలానుకూలంబుగా
వినయత్వంబు నయంబు సూపుచల మేల్వేడూరు భక్తావనా!
వినుతిన్ సల్పుచు భక్తినర్పవలు సంప్రీతి న్దగన్సల్పిన
న్వనజాతాక్ష! భవత్కృపన్గొనవు కృష్ణా! రావె! నన్నుఁ బ్రోవవే! 80

మ॥ కలనుంగాంచిన వస్తుసంతతిని నిక్కంబంచు భాషింపగా
ఫలమేమో కనుదోయి విం గనక నిక్కంబాద్యుశా! యంచొగిన్
గలకాలంబు వచింప నేమగు పృథాకష్టంబహో భక్తవ
త్సలత న్నెట్టు లొనర్పవే కృపను కృష్ణా! రావె! నన్నుఁ బ్రోవవే 81

మ॥ గురువిశ్వాసల్గొన మంత్రి జేరితుని నెగ్గుల్ సల్పి చాంచల్యుడై
గురుశాపాకృతి నక్కలాగరిను వింశున్నేత్రమై యొప్పగా
ధరిఁ యుంస్మృతిగొంటి నీవటు నగాధ్యానుండగానయ్య నీ
పరివారీభగ నెవ్వనమ్మి హరి కృష్ణా! రావె! నన్నుఁ బ్రోవవే 82

మ॥ భుజగున్ శయ్యగ తార్క్ష్యవాహముగ సంభోజాసనుం బుత్రిగా
నజరానీకము భక్తసంతతిగ మేలర్కాబ్జు గన్దోయిగా
విజయున్ శ్యాలకుగన్ మహాత్ములమునాథిన్ జేసితౌ మున్ను విన్
భజమానార్యకగంబ మెగ్గగునె కృష్ణా! రావె! నన్బ్రోవవే! 83

మ॥ కవిశిష్యుల్ ల్బోసరించు కృత్యములు వక్కాణించి బోకార్చితే
భువి దైతేయకదంబశూన్యముగ సంభోజాక్షా! గావించితే
నివురుంగప్పు హుతాశనుంబలె వనిం గ్రీడల్దగ న్సల్పగ
న్నవురా భక్తపరాయణా! వరద! కృష్ణా! రావె! నన్బ్రోవవే! 84

శా॥ గ్రాసంబందుట కార్జన న్సలుప సంగ్రామంబు భిక్షాటనం
బాసంతంబు దుకాణముల్ హాలిక విద్యన్ వ్యాళసారధ్య మే
వేసంబు న్బొనరింపజాల నిక నిన్వేమూరు నే దీనతన్
దాసత్వం బొనరించెద న్మతిని కృష్ణా! రావె! నన్బ్రోవవే! 85

మ॥ ఘటికాద్వంద్వమును న్మదిన్నిలిపి నిర్గై యొప్ప ధ్యాసింపగా
దృటి ఖట్వాంగనృపాలునిం బురిని తద్దీప్తిన్ ప్రజాసంఘమున్
యెటుల న్సత్వర మందజేసితివి యయ్యేర్పాటు జెన్నొందగ
న్నటు లాంతర్యముఁ గొల్పి గ్రద్దనను కృష్ణా! రావె! నన్బ్రోవవే 86

శా॥ సారోదారుఁడు భూసురోత్తముఁడు సుజ్ఞానుం డజామీళుఁ డా
నారీరత్నమునుం వరించి ఖలుఁడై నానాప్రకారంబులన్
శ్రీరమ్యంబుగ బుత్రులంబడసి దుశ్చేష్ట న్ప్రవర్తించినన్
సారుశ్యంబుగ వాని బ్రోచితివి కృష్ణా! రావె! నన్బ్రోవవే! 87

మ॥ కరతాళధ్వనులీన నో హరి రమాకాంతా హృదబ్జాళి సు
స్థిర భావాభవు మామ యోవరద యంచెప్పున్ నుతిన్సల్ప నా
మొరనాలింప వదేల దుష్కృతశ మెటుల్ మున్నే మిగావించితిన్
సరసంబొప్ప భవద్దయ న్గొనవు కృష్ణా! రావె! నన్బ్రోవవే! 88

మ॥ ఒనరన్భాస్కర సంతతిన్వెలయ నోహో వర్ణ సంయుక్తమై
మనువై యొప్పగ నుత్తబట్టబయ లిమ్మాడ్కిన్ గనంజేయనై
ననుమున్నాపుకుజేరి శ్రీగురుడు మాన్యత్వంబుగా దెల్పుటన్
యనయంబద్ది స్మరింపబూనితిని కృష్ణా! రావె! నన్బ్రోవవే! 89

మ॥ వనజారి ప్రతిమ న్దగఁ బెలయు సొంపౌ సత్కళాసంఖ్యయై
తనరన్సర్వము మిథ్యయేయనుచు గర్తవ్యంబు శూన్యంబటం
చను బీజవ్రజమందు యమ్మనువు సాంఖ్యం బెంచి యద్దానిని
న్గను పుత్రాయని తెల్పె దేశికుడు కృష్ణా! రావె! నన్బ్రోవవే! 90

శా॥ నీచే కల్పిత శబ్దసంతతుల దస్విద్ధిర ప్రార్థించు టా
లోచింపంగ క్షితీశువిత్తము గృపాభూ యక్షితీశుఁ దగం
బేచిఁ జెందగజేర్చునట్టులుగ సుమిన్నా తోఁచె డెందంబున
న్వాచాలత్వఫలంబు నందగను కృష్ణా! రావె! నన్బ్రోవవే! 91

మ॥ నిను గాంక్షించి స్మరింపబూనిన మునుల్నిర్మించియున్నట్టి పా
వనమై యొప్పు యతివ్రజంబునను దేవా కొన్ని నింద్యంబటం
చును గొందర్ పలురీతులందురు గనన్ జోద్యంబునై యొప్పె స
జ్జను లాచందము లెట్టుగూర్చిరోకో కృష్ణా! రావె! నన్బ్రోవవె 92

మ॥ నరులన్వేడ మనంబు నొల్లదెపుడు న్నారాయణాతీతమా
పరతత్వంబున డెందముఁ జూనిపి కంపింబింగలం బైక్యమా
కరణిఁ మేల్ యశరీరవర్తన సకృత్కాంక్షన్ప్రవర్తించు న
న్నరలేకన్గరుణింప భారమగు కృష్ణా! రావె! నన్బ్రోవవే! 93

మ॥ అలభద్రాచలమన్న నిర్చసులు నిత్యంబంచు నద్దానియం
దలివాసంబుగనున్న విష్ణువు ననాత్మం బైక్యమున్సల్పినన్
గలకాలంబు నిరామయత్వమగు నిక్కంబద్ధియోచించి ని
శ్చలతన్నెట్టులొనర్పు మీదయను కృష్ణా! రావె! నన్బ్రోవవే! 94

మ॥ ఇదినిత్యంబిదియుఁ మృషంచెరుగు నప్డీడెందమేమయ్యెనం
చదియోచింప మనస్మ హాత్పలమునం దాపించెయు న్గల్గినన్
మొదలుత్పత్తి నెసంగుపూత లయము న్నొందంగ నబ్రించె విన్
యదియుఁ ధ్వాంతమినుంగనంజనదె కృష్ణా! రావె! నన్బ్రోవవే! 95

మ॥ వసుదేవున్మను తండ్రిగాగొనియు దేవా క్రమ్మరన్ యెన్న నా
వసుదేవున్నశినేత్ర సత్పథముగన్వర్తించితో యింక మే
ల్వసువై యొప్పితివా భవచ్చరితముల్వర్ణింప శక్యంబెవిన్
యసమానత్వము సత్కళాగరిమ కృష్ణా! రావె! నన్బ్రోవవే! 96

శా॥ నీవేజీవుఁడటన్న నీశ్వరుఁడన న్నిత్యంబు ప్రపంచన
న్నీవేమేను జగత్త్రయంబును గన న్నీవే తగన్సాక్షియు
న్నీవేకర్తవు ప్రత్యగాత్ముఁడవుగా నీవేపరం బ్రీక్రియన్
యావీరా హరి చిన్మయా వరద కృష్ణా! రావె! నన్బ్రోవవే! 97

శా॥ జోహారుల్పొనరింతు నెల్లపుడు దాసోహంబు వర్తింపగా
బాహాటంబుగ బల్కుతిన్నుతిని సత్పాత్రావళీన్యత నొప్పగా
జోహారుల్గొని సర్వసంపదల మెచ్చున్నందజేకూర్చి దా
త్సాహాయంబు దనర్పుమీకృపను కృష్ణా! రావె! నన్బ్రోవవే! 98

మ॥ సరసత్వంబుగ శాలివాహనుని మేల్ సంఖ్యన్సహస్రంబు శ్రీ
కరమౌ యష్టశతంబునల్బడియు బ్రఖ్యాతిన్ ద్వికంబొప్ప సు
స్థిరమౌ రౌద్రియభిఖ్యయబ్దమున గస్థింగూర్చితి పద్యముల్
పరిగాథాలిని రాట్కథల్ జొనిపి కృష్ణా! రావె! నన్బ్రోవవే! 99

మ॥ ధర నీపాత్తము మండలత్రయమున లెందాకన్బ్రకాశించునో
గరిమ న్నందనుకన్ సుకీర్తినిలుపంగా వేడెదన్ దేవ త్వ
త్కరుణన్ దవ్వతుజేసి భక్తులహృదిం దానుండునంచన్న యీ
నరసంబౌ బిరుదందియుం గ్వరను కృష్ణా! రావె! నన్బ్రోవవే! 100

మ॥ సరిగన్మంగళమయ్య సాందిపు పదచ్ఛాత్రా మురారీ హరీ
వరదా మంగళమయ్య నిర్మల సుధీవారా ప్రభో నేడు న
ద్గరిమన్ మంగళమయ్య భావరహితా కాంక్షప్రదా సర్వకున్
వరలున్నిత్యము మంగళంబగుచు కృష్ణా! రావె! నన్బ్రోవవే! 101

ఏతత్సర్వంబును శ్రీకృష్ణార్పణము.



# ఈ గ్రంథము రచించిన కవిగారి స్వానుభవ స్థితినిగురించి

శా॥ శ్రీరామాధర సాధువర్యుల దగన్ • శ్రీయోభిలాషంగడున్
సారస్యంబుగ నెల్లసౌఖ్యముల గ్రి•న్నగ్నావనీవంచు మున్
ధీరుల్లూర్చిన కబ్జముల్లని మహా•దేవా యజస్రంబు యేన్
తూరత్వంబగు భక్తిభానమున శం•తూస్రిషన్బలీ మేలనన్
సారోదారత సల్పుచున్న నది మెం•చ్చెంజూచి బ్రోవంగ త్వ
ద్భారం జేగద యట్లుసేయక పరం•ధామా రమానాథ ని
స్సారం బందగజూచి గాథలను లెం•స్సంగూర్చి నానాదురు
గ్భారంబొప్పగజేసి యిప్పగిది వేం•డ్కన్ నిల్వ వీల్లైన యా
ధారం బెట్టి నొసంగక స్వీవుల మొం•దం జిత్త చాంచల్యతన్
మేరం జెందగనీక భక్తికెవి యే•మేమింగోనన్నిక నె
వ్వారల్ శత్రునిగాగనుంగొనగ విన్•బాబూ ఘటించెన్ భవ
త్కారుణ్యంబో స్వకర్మలబ్ధమెయో•కార్చిచ్చుదాకెన్ వృథా
పోరుంబూనిన నీక్కుకుండ నిడుముల్ • బోకాన్పవీలా మహా
దారుల్వైయలు నాగ్గురౌ నృపులు గ•ర్తవ్యంబును స్వీడియుం
బోరే షోడశచక్రివర్తులటుల • నొబ్బొల్లాంవ నాకంబుకున్
ఘోరీతిం దవ మేల్ శకంబొకటిగ్రాయె • యక్కాలమే తెంచె నం
చారూఢంబును మద్గురోత్తముడు నా•కానాడె దెల్పెంజుడీ
సారాచారులు బెద్దనాది సచివుల్ • సంస్థవ్యమున్నల్పి ని
ష్పారంబంచని మిన్నకున్ననది యిం•చ్చన్నన్మిశ్ర యాసింపకే
తీరో దీనతనుంట నబ్బె నహహా • దీనార్థి చింతామణీ
శ్రీ రాజత్కరుణావలోకనము దం•డ్రి నిల్పి బ్రోవంగదే
కారుల్ నూరొనరించి నన్నుపుడు నా•కాకాసురుం బ్రోవవే
ధీరా యోకరిరాజసద్వరద యో • ధీవర్య కృష్ణా! హరీ!

ఇట్లు,

పీసపాటి కోటీశ్వర శర్మ.



